గీ. జంభశాసనపురమణిసాలచక్ర, మండలీకృతనిజభోగకుండలీశ
ముచ్యమానవినూత్ననిర్మోకయష్టి, యచ్చరల కంతఁ జూపట్టె నభ్రగంగ. 69

చ. కనకమయాంబుజప్రసవగంధము లానియు బిందుపంక్తిచే
ననయము దొప్పఁదోఁగియును నభ్రసరిత్పవనంబు లప్సరాం
గనలముఖాబ్జసౌరభము ఘర్మజలంబులుఁ గ్రోలెఁ గ్రొత్తలై
ఘనతరలాభముం గలుగఁ గైకొనరే ధర నెంతత్రుప్తులున్? 70

తే. కూడి జలదేవతలు మమ్ముఁ గూడవచ్చి, రెంతచక్కనివా రంచు నెపుడు వెలఁగు
దనుక మిన్నేటఁ దమనీడఁ దార చూచి, ముచ్చటలఁ బొంది రప్సరోముగ్ధ లపుడు.

చ. త్రిదశతరంగిణిం గడచి తీవ్రతమై దిగి వచ్చి దేవతా
సుదతులయూర్పుఁదావిచవిఁ బోఁకున వెంటన వచ్చెఁ దేంట్లు త
ద్వదనసనాభివర్ణము నవశ్యతఁ బంపఁగఁ బంపు పూని యు
న్నదికమలాధిదేవతల నచ్చిరనెయ్యురు వచ్చిరో యనన్. 72

ఉ. వచ్చువిమానపంక్తులజవంబున జల్లున మున్ను పాయ గా
విచ్చినవారివాహములు వెండియు వెంటన రాఁ దొణంగె న
య్యచ్చరపిండుఁ జూచి తమ రప్పుడు వాయుట నాత్మకీయువి
ద్యుచ్చయశంకమై తగిలి తోడనె కుయ్యిడుమాడ్కి మ్రోయుచున్. 73

ఉ. మందసమీరణక్రియల మార్గపరిశ్రమశాంతిగాఁ బయో
బిందువిముక్తి నింపుమదిఁ బెంపుచు నీడలు సేయఁ దోయభృ
ద్బృందమునందు మెల్లనిగతిం జనఁగా నియమించి రప్డు సం
క్రందనవారకామినులు కామగమైనవిమానసంఘమున్. 74

చ. పొదిగొనుమాడ్కిఁ ల న్మెఱచి పోని మెఱుంగులు గా నిగుడ్చుచుం
జెదరనిభూషణప్రభల జిష్ణుధనుశ్శతకోటిఁ బన్నుచుం
ద్రిదశపురీవిలాసినులు దెల్లమిగా జనియింపఁ జేసి రం
బుదముల కెల్ల నట్లొకయపూర్వమనోజ్ఞవిలాససంపదల్. 75

తే. అద్రిశృంగము లనుశంక నధిగమింపఁ, గోరియునుబోలె బలుమాఱు వారిధరము
లాత్మపవనంబుచేత నయ్యమరసతుల, పయ్యెదలు దూల్చి కుచములు బయలుపఱిచె.

చ. తపమునఁ బంగుశాసనము దానపువిత్తు ఫలించుపాదు ని
క్కపుసుఖసిద్ధి గోరి వెదకం దగునాకర మబ్జజాదివి
ష్టపములకెల్ల సంబళ మొసంగెడుపాలెము మర్త్య మంత వే
లుపువెలుచ్చెకంట్లకును లోచనగోచర మయ్యె దవ్వులన్. 77

వ. తదనంతరంబ. 78

సీ. సంభవించె నపూర్వషట్పదగీతులు, లలితమంజీరఝుళంఝుళములు
ప్రాపించె నభినవపరిపక్వతారనములు, కాకలీవ్యాహారకలకలములు
బుగులుకొనె నవీనపుష్పసౌరభములు, గుంభితాస్యామోదఘుమఘుమములు
కలిగెఁ దద్ధ్వనికి సుజ్వలపల్లవద్యుతుల్, శయనశేశయవికాసచకచకలు
తే. భూవరాన్వయతిలకతపోనివాస, మగుట నొదవినభాగ్యోదయమునఁ బోలె
నపుడు సరయూనదీతీరవిపినమునకు, నమరపురవారలలనాసమాగమమున. 79

వ. ఇట్లు తత్తపోవనప్రాంతంబున విడిదిగా విడిసి. 80

## మాంధాత్రృతపోవనంబున రంభాదులు శృంగారక్రీడ లొనర్చుట.

మ. కర మాశ్చర్యము గాఁగ నచ్చరలు శృంగారోజ్జ్వలాకారు లై
సరసక్రీడలఁ జొచ్చి రానృపతపస్సంస్థాన ముచ్చైచ్చరట
చ్చరణాంభోరుహనూపురధ్వనుల నాశ్చర్యానుమోదంబు లై
హరిణీసంఘము దర్భగర్భితముఖవ్యావృత్తి నాలింపఁగన్. 81

సీ. పరిమళించు బంటుక పసుపంపుమొగ్గల, కెలయించుతనుగాలిపాలపమునకుఁ
వనులోని జాతివైరము డించి దూర్వముల్, మెట్టనిమృగజాతి మెలఁకువలకుఁ
బక్వసారస్వాదుకఫలపుష్పములు గల్గు, తరువులనీడలు దరలమికిని
బగలు రే యనుకొనితొగలఁ జమ్ములఁ గ్రాలు, కొలఁకులు గడ లెత్తి కలఁగమికిని
తే. మెఱుఁగు దనుకంగ నిజతపోవిధన మాత్మ, మెచ్చి పొగడుచుఁ జనుదెంచునచ్చరలకుఁ
జిత్తవికృతుల జనియింపఁ జేసి శంక, నపుడు గనుపట్టె యువనాశ్వనృపతిపట్టి. 82

ఉ. దంతిల సంతతాయతపసుఁదీఁకటి పైకొనసీక తేజ మా
క్రాంతదిగంత మై వెలయు గాడుపు సోఁకనిదీపమట్ల వి
శ్రాంతిసమాధిసంగతిఁ జచంచలుఁ డైనతపస్వియందుఁ ద
త్కాంతలయత్నముల్ విఫలకార్యము లై విలసించె నయ్యెడన్. 83

చ. ఒకయుమ నెత్తి జంగ యిడ నూరురుచుల్ తలచూపఁ దీవ యం
దుకొని నిగుడ్చు నిక్కపదోర్లతమూలము చూడ్కిచూఱగా
నకనక కొను సాఁగి వలినాభి బయల్పడ నీవి జాఱ మీఁ
దికి మొగ మెత్తి యొక్కసుదతీమణి చేరువఁ గోసెఁ గ్రొవ్విరుల్. 84

చ. పవనముల గెంపునకు బయలు పల్లవితంబుగ రాకలోకలల్
వదనము తీవఁ జందురుని వైఖరి చూపఁగ దూఁగఁదూఁగఁ బ
య్యెద పలుమాఱు గాలి సెగయం జనుగుబ్బలు తొంగిచూడఁ గాఁ
బ్రదళవధూటి వేడ్కతో తీవల నుయ్యల లూఁగె వేడుకన్. 85

చ. కొలఁదిగ నీడ్చి యీడ్చి కొనగోళ్ళ మెఱుంగు దుఱంగలింపఁ గా
వలపల దాపల న్నిగిడి వాలికచూపులు తీఁగె సాఁగ ను
బ్బలయిరు గ్రేవల న్నఖరపంక్తి బయల్పడఁ జేతు లార్చుచున్
వెలఁది యొకర్తె కట్టెదుర వేనలి చిక్కుడలించె సోలుచున్. 86

ఉ. పట్టినహస్తకాంతి మును పల్లవితం బగువీణె పాటచేఁ
బుట్టుచిగుళ్ల రెట్టి యగుపోల్కి వహింప మొగంబుతావికిం
జుట్టినతేంట్లకున్ శ్రుతులు చూప సుధారసధార పాలికం
బట్టి మృదుస్వరం బెసఁగఁ బాడె నొకర్తు మనోజ్ఞభంగులన్. 87

క. ఈరీతి వివిధమధురా, కారంబులఁ దమవిలాసగరిమలు నెఱపన్
మేరుగిరిలీల మలయుచు, మీరణగతులసను బోలె మెదలక యున్నన్. 88

సీ. కుసుమపల్లవభాసికుంజపుంజంబులు, రత్నచిత్రితమందిరంబు లయ్యె
నత్తాలధరణీరుహోత్కరస్థలములు, నవమణిస్తంభమండపము లయ్యెఁ
బావనస్నానార్థబహుపల్వలంబులు, కృతకకేళీసరోవితతు లయ్యె
విహరమాణానేకవిధశకుంతంబులు, తరుణపారావతద్వయము లయ్యెఁ
తే. దీవ్రనియమానుకూలప్రదేశ మైన, యర్కకులమౌళి నివసించునాశ్రమంబు
హరిరతిఖేలనోచితహర్మ్య మయ్యె, మఘునదిందీవరాక్షులమాయవలన. 89

వ. అనంతరంబ సమయసముచితసన్మార్గధూపలేపస్రగ్బలిప్రకరవర్ణనోపశోభితం బై తపస్వి రంగంబు విలాసినీలాస్యరంగం బగుచు లోకవిలోచనోత్సవంబు నాపాదింప ననూరూపరూపానవద్యవాద్యధ్వనులతోడ నవినూత్నవిచిత్రయవనికాభోగంబు నభోభాగంబు నలంకరించె. నృత్తవిద్యాచాతుర్యధుర్యుం డగునాచార్యుండు కట్టెదుర మధురగంభీరస్ఫుటాక్షరంబు గాఁ బుష్పాంజలిక్షేపణంబుతోఁ బ్రస్తుతోచితపంచలాస్యప్రస్తావంబు చూపి యవనికాపనయపూర్వకంబుగా షోడశాప్తచతుర్ద్వయాద్వయైకక్రమసంఖ్యాకంబు లగుమృదంగకాహళకాంస్యతాళహుడుక్కాకరడావాద్యవిశేషంబులయందు నేకైకమేళాపరవాదనోపరిపరిస్ఫురితంబుల గుణగణశీలాగుమోడిబంధవతికుండల్యాదివాదనభేదంబుల వివిధమధురగంభీరఘోషంబు లఖిలచేతనశ్రవణేంద్రియమోహకంబు లయ్యె. ఉపరతము రజకరడాహుడుక్కాదినాదంబులు నతిచతురవాంశికోపదీయమానతానోపగీయమానవీణాదిపేశలకలక్వాణప్రాణాయమానంబులం బ్రోజ్జ్వలాలప్తిపూర్వకంబులు నై కాకువాదిదోషరహితకలకంఠకంఠగీయమానగేయంబు లనుపమేయంబు లై నిఖిలచేతనాచేతనస్రావకంబు లయ్యె. మలయపవనచపలశిలీముఖముఖరస్థలనలినీకులవిలాసాపహాసకంబు లయి యనుమాష్ఠాధికనూపురఝుళంఝుళశింజితమంజులంబులు గావించి విచిత్రరతిప్రస్తుతంబు లగు నేప

ధ్యాంతరితపాత్రంబులఁ గించిల్లక్ష్యమాణపదపల్లవాంచలంబులు దివ్యక్షుజనహృదయో
న్మాదకంబు లయ్యె. గనుపెను దివిసినం గనుపట్టువిచిత్రచిత్రరూపంబులరూపంబున
యవనికాభోగంబు వసయింప నిశ్శబ్దభూషణంబును నిర్వికృతినియతసకలాంగకంబు
నగునిజసౌశ్చల్యంబు నిర్భరం బై పైవాతి సారవశ్యచ్ఛలంబున పశ్యజ్జనంబులపయిం
బఱం బిరనొను ప్రనాళి నండి కాన్పయియామండితపుష్పాంజలివిలసిత లగున ర్తకీపరంపర
లఖిలమేళ సేతోవిలోకనగ్రాహంబు లై యావిష్కరించె. ద్రష్టృజనకౌతుకావేశోద
యాపాదితకంపరిఘూర్ణితమానపునర్నికల్పితాతిసూక్ష్మయవనికాప్యాయంబున లఘు
మేఘావృతి దొలంగి మెఱుం గెక్కుశారదనక్షత్రంబులచందంబున నిర్నిమేషనిరీక్షణ
పాత్రంబు లై పాత్రంబు లను సూప నేపథ్యస్ఫురితంబులు సమపాదస్థానకస్థితంబులుం
గీతానుగుణాకంపితశిరస్కంబులు నగుచు విలాసగతిం బుష్పాంజలిక్షేపణం బొనరించి
నిఖిలాలోకవిలోకనోత్సాహ్యంబు లై నవదండలాస్యంబులకు నుపక్రమించి రవ్వేడు శిరో
నక్షత్రకరపార్శ్వకటిపదాభిధానంబుల నేత్రభ్రూనాసాహనుకపోలాధరనామధేయం
బులం గ్రీవాబాహుతుండోరుజానుజంఘానామంబులం గల్గుసంగోపాంగప్రత్యంగం
బుల తాళలయానుకరణవిశిష్టచేష్టావిశేషంబులయందుఁ బ్రత్యేకంబ యథోక్తంబు
లగు త్రయోదశనవషడ్విధప్రయోగంబులు పంచప్రకారవత్షోవిలసనంబులు చతుష్షష్టి
భేదప్రశస్తహస్తాభినయంబులు నంగుళిక్రమపరివర్తనోపచితచతుర్విధహస్తాభినయాంత
రంబులుం బంచపార్శ్వవిధిప్రసంగంబులుం బంచవిధకటినటనంబులు నవసంఖ్యాకరచరణ
విన్యాసంబులుం జతుర్భంగికచరణవిన్యాసాంతరంబులునుం బంచప్రకారవత్షోవిలస
నంబులును షట్త్రింశద్దృష్టివిశేషంబులు నుపాంగభేదోక్తచతుర్విధ ముఖరాగయోగం
బులు స్ఫురితాబహుస్ఫురణంబులుఁ బంచప్రకారోరుసంచలనంబులును సప్తవిధజాను
విలాసంబులును బంచవిధజంఘాప్రవర్తనంబులును వెండియు దండలాసకాంగోక్తకం
బులను త్రింశత్స్థానకంబులు త్రింశచ్చారిభేదంబులు భ్రమరిసప్తకంబునుం గరణవింశ
తియు నంగహారవింశతంబును మఱియు ముఖసముఖసౌష్ఠవలలితభావకౌతుక్యనుమాన
ప్రమాణప్రమాణం గానాసు గుణాంగాసంగడాలఢిల్లాయినవణికిత్తుతరహారోల్లాస వేవతన
నిలయుపయపాటునసంధ్యాపదహిక్కనామంబులం గలుగులాస్యాంగచతుర్వింశతివిశే
షంబులు నాడగాఁ గలుగునసంఖ్యేయాభినవాభినయంబులు యథాలక్షణంబులు
యథాక్రమములు యథావసంబులుం గా నృత్యప్రవర్తనంబున నభినయించుచుఁ
బాత్రగుణవ్యక్తప్రగుణక్రియంబులు శిల్పనైచిత్రీసమాలోచనసూచకంబులుం బరస్పర
సామ్యలక్ష్మీప్రస్తారంబులు బహుహస్తప్రయోగప్రయోజనంబులుం గ్రియామాత్ర
గ్యమాగుణిణీకరణంబులును సభ్యనేత్రచమత్కారకారకంబులు నై ఘనభిమభేదద్విధా
కారంబు లగువివిధవిచిత్రబంధప్రచారంబుల విలసింపం జొచ్చి రంచు నూర్వశియుం
బరాగిణి తి మఱి మేనకయు సహజన్యయుం బ్రమ్లోచయు ననుమ్లోచయుఁ బుంజికస్థ

లయు గృతస్థలయు విశ్వాచియు ఘృతాచియు మనోరమయు రంభయుఁ దిలోత్తమ
యుఁ జంద్రరేఖయుం బంచచూడయు మిశ్రితయు మిశ్రకేశియు మొదలుగాఁ
గలిగినచతుర్దశవంశావతీర్ణంబులు షోడశకోటిసంఖ్యాకంబులు తుల్యరూపవయో
విభ్రమంబు లై చరింపఁ బ్రపంచమనోవంచకంబు లగుదివ్యాప్సరోజనంబులు శంబ
రారికిం దోడుచూపుచుఁ దదీయమూలబలంబు చందంబునం బర్జన్యునకుఁ
దోడుచుం బుశంపాపరంపలవిధంబున వసంతునకు నెన్నిక యిచ్చుపుష్పలతికలవిలస
నంబునం గ్రమంబున జతురష్టషోడశద్వాత్రింశచ్చతుష్షష్ట్యాద్యుత్తరోత్తరగణనా
వృద్ధివిశేషంబులం బంక్తిబంధబంధురగతి నద్భుతాద్భుతంబుగా నావిర్భవించుచు దండ
యుగ్మంబుల నంజలిపుటంబులు ఘటియించుచుఁ బరస్పరసామ్ముఖ్యంబునం బొలు
చుచు నితరేతరస్థితస్థలవినిమయంబు చూపుచు నిరంతరనూపురఝుళంఝుళశింజిత
మంజులంబుగా సవ్యాపసవ్యపార్శ్వంబులం గ్రమప్రసృతపార్ష్ణిప్రచారంబులు
గొలుపుచు వాద్యతాళయతిమానంబు లాకర్ణించుచుఁ దదనుగతంబు గా నర్త
నౌత్సుక్యజచిత్తవికారానుకారం బగుశరీరపారవశ్యంబు నెఱపుచు నాకులవర్తనంబు
లం బ్రవర్తించుచు మండలప్రచారంబుల సంచరించుచు వాద్యానుకృతంబులు గా నంఘ్రి
తాళంబు లిచ్చుచు నాభిముఖ్యపరావృత్తముఖంబుల దండతాడనంబులు గావిం
చుచు వాద్యతాళానుకూలంబుగా నితరేతరదండానువిద్ధస్థానకంబులు సంఘటించుచు
హస్తచలనవలనవర్తకీవర్తనంబుల నర్తించుచు లయత్రయసమన్వితంబుగా వివిధబంధ
బంధురప్రచారంబుల విహరించుచుం గేవలయతిమానంబున నృత్తబంధప్రవర్తనం
బుల వినసించుచు నృత్తప్రయోగబంధప్రయోగంబులు రంటియందు నాదిమధ్య
నిర్వాహంబులం గ్రమంబున మృదుమధ్యద్రుతగతిభ్రమరీవిశేషంబులం బరిగ్రహిం
చుచుఁ బ్రతిగతిసమాపనంబున నతికోమలంబుగా స్థానకోపక్రమంబు నెఱపుచు నుప
క్రాంతభావంబుల రసోత్తరంబుగాఁ గళాసించుచుఁ బ్రనృత్తైకమార్గంబు నంపంద
యమందరసోదయవశంబున నూత్ననూత్నంబుగా సముక్తవిచిత్రాంతరమార్గాంతరం
బులం బ్రపంచించుచు ఋజుచతుష్కచక్రాకారగతిత్రయీప్రారబ్ధంబులు పరస్పర
వ్యతిలంఘనమార్గరూపంబులు నై సారిచంద్రకళాబంధుసారమురడిహంస లీలావిఘ్నాం
గాభరణనారాయణవల్లభ చతుర్ముఖరంగలక్ష్మీరంగమనోహరాదివివిధమధురాసనకబంధ
ప్రచారంబుల నటియింపం జొచ్చిరి. ఇవ్విధంబున సౌందర్యంబులకు సాఫల్యంబును
దారుణ్యంబులకుఁ గృతార్థతయు లావణ్యంబులకు నుత్తేజనంబును విభ్రమంబులకు
నుపాదానంబును నేపథ్యంబులకు విషయంబును నై నర్తకీవిలోకనజనితం బైనశృంగా
రంబును దదీయవివిధాపూర్వనృత్తబంధవిషయం బైనయాశ్చర్యంబును దదన్యలాసి
కాంతరవిషయం బైనహాస్యంబును దదితరవిషయం బైనబీభత్సంబును దదీయసమోఘ
రభరభుగ్నావలగ్న శంకితభంగివిషయం బైనభయానకంబును రసాతిరేకసద్యస్స్ఖలితహిత్త

ననుపుఁబల్లవులను నర్ఘ్యోపచారముల్, సేయు సేవ నూఁదుచిగురుఁబోండ్లు
చిత్ర మైనతపసిశిష్యు లై పరిచర్య, చూపు చుండి రాత్మశుద్ధి గలిగి. 95

క. చిరకాల మిట్లు వారిం, బరిచర్యలు గొని తపస్వి పర్వానకృపమై
మరలం బనిచిన నంతయుఁ, బురందరుం డెఱిఁగి యాత్మఁ బొందమిభీతిన్. 96

## ఇంద్రుఁడు మాంధాతపై మేఘములనంప బృహస్పతితో నాలోచించుట.

తే. దిగధిపాలుర నెల్లఁ దోడ్తేరఁ బనిచి, వారు దాను రహస్యవిచారపరత
నుండి వెఱతోడి భయమున నుదిలకొనుచుఁ, బలికె గీష్పతిఁ జూచి యాబలవిభేది. 97

చ. నరసురదైత్యజాతిజు లొనర్పరె మున్ను దపంబు ధాత్రిపై?
మరునకు లోను గానిధృతిమంతుఁడు గల్గినఁ గల్గుఁ గాక! శం
బరరిపుబంటుగాఁ గొనుతపస్వియుఁ గల్గునె? చూడు మంత న
చ్చర లఁట శిష్యులై రెపెఱసంయమియుం గలఁడే యిఁకెన్నఁగన్. 98

ఉ. ఖండసుధాకరాలికలు గాఢవిరక్తిఁ దపస్విశిష్యలై
యుండిరి పూఁపు దప్పుటకు నుల్లము రోసి రతీశుఁ డిక్షుకో
దండముఁ బుష్పబాణములదండముఁ బాఱఁగ వైచి చేతులం
దండమునుం గమండలువుఁ దాలిచి మస్కరి గాక యుండునే? 99

తే. కార్య మెయ్యది మనకు నక్కడిఁదితపసి, కంతరాయంబు పుట్టెడునంత గాఁగ
వర్ష మొదవింపఁ బుష్కలావర్తకములఁ బంపుదమె? యన్న విని నవ్వి పలికె గురుఁడు.

## బృహస్పతి యింద్రునకు మాంధాత వశ్యుఁడు గాఁ డని చెప్పుట.

ఉ. కా దమరేశ! కార్య మది కన్గొన బ్రహ్మను నైన మన్మథో
న్మాదము గొల్పునచ్చరలమానస మింతటిలో విరక్తికిం
బాదుగఁ జూడ నేర్చినతపస్విశిఖామణి మింటఁ బన్నినం
భోదకులోదయంబు నలపోకయ నువ్వున బాఱ నూఁదఁడే. 101

ఉ. అద్రులు మీఁదఁ బడ్డ భర మాటఁ దలంపరు శూలహస్తయై
భద్ర యదల్చి పైకొనిన భ్రాంతి వహింపరు మేర దప్పి సా
ముద్రతరంగముల్ దిశలు ముంచినఁ జింతిల రన్న వారిదో
పద్రవవృత్తికిం గలఁగఁ బాఱుదురే హరిభక్తినిశ్చలుల్?. 102

సీ. దూషింప నొల్లరు దుష్టాత్మకుల నైనఁ, బ్రతి సేయ నొల్లరు పగతు నైన
నభిలషింపఁగ నొల్ల రాత్మదేహం బైన, వగవంగ నొల్లరు వొగిలి యైనఁ
బట్టంగ నొల్లరు ప్రాణసంకట మైన, నాడింపఁ గొన నొల్ల రలసి యైన
వాదింప నొల్లరు వశ మైనపని యైన, వాఱుపెట్ట నొల్లరు మర్మ మైన

చ. కరుణయు గాక నన్ను నరికట్టఁగ నీ వొకలక్ష్య మెట్లొ? యం
బర మఖిలంబు మ్రింగి యసుపట్టులఁ గ్రాసెదఁ జూడు నున్నయ
ప్పరుసున నిప్పయోంబునిధి పల్మఱుఁ జెల్లెలికట్టమీఁదఁ బె
ల్లరదుగఁ బ్రోవుకొల్పెడు మహోర్మికోపమహార్త్తికావలిన్. 112

చ. వెడఁదలు గాఁగవించుమఁ బ్రవేశతటంబుల నొగ్గి క్రోలి నో
ళ్లడవఁగ వీఁపుచిప్ప లెగయుం బడి పింజలు వాఱ మింటిపై
వెడలునదీప్రవాహములనెంటని వెల్వడఁ గాంచు నిమ్మహా
జడనిధిలోని శాబకఝషంబులు మ్రింగినగర్భశైలముల్. 113

ఉ. ప్రేల దలిర్ప మి న్నొరసి పెచ్చుమఱుఁగ్లహరీవిజృంభణా
ఖేలతఁ జూచి ముంచు నని బెగ్గిలి వెల్వడి పోవుబాడబ
జ్వాలలు కిప్పయోంబుధి యొసంగుకృపాభయహస్తపఙ్క్తులం
బోలెడుఁ దీరవిద్రుమసమూహశిరఃపతదూర్మిమాలికల్. 114

చ. ఎడపక యిచ్చుదాతలకు నివ్వలఁ గల్గుచు నుండు నిక్కమి
క్కడలిప యశ్రప్రపూరము లగణ్యము లైనఘనాఘనంబు లె
ప్పుడుఁ దనియంగఁ గ్రోలికొని పోయి నిరంతరవృష్టి చూపుటం
బొడమినయేఱు లీయుదధిపుంగవునందె గమించి కూడెడున్. 115

తే. విశ్వవిశ్వంభరకు హారవిలసనంబు, దోఁపఁ జేయును నున్నది దుగ్ధవార్ధి
యున్నవాఁ డిందు నిందీవరోజ్జ్వలుండు, నాయకస్ఫూర్తి నాదినారాయణుండు. 116

వ. అని యనేకభంగులం గొనియాడుచుం జని యప్పయఃపయోనిధానంబునకు నంతరం
గంబునం బోని శ్వేతద్వీపంబు లోచనగోచరం బగుటయుఁ బ్రహృష్టాంతరంగు
లగుచుం గరకమలంబులు మొగిచి నభోపతనంబు బొనరించి బహుసహస్రయోజన
విశాలరమణీయం బైనయమ్మహాద్వీపంబునం జూపట్టువివిధవిశేషంబు లొండొరులకుం
జూపి చెప్పికొనుచుం జనువారు ముందట. 117

## శ్రీవైకుంఠవర్ణనము.

మ. నముచిద్వేషిముఖామరు ల్గనిరి సంబాధస్వభూనీలకం
ఠము సభ్రంకషసాలచక్రనవరత్నశ్రీకృతాశావకా
శము దౌవారికరుద్ధసిద్ధమునిపూర్వస్వాపకంసంబు నా
త్మనవకల్పితనిష్కలాద్భుతపయోత్కంఠంబు వైకుంఠమున్. 118

క. కని యంతంతట వినయా, వనతశిరస్కు లయి చేరవచ్చి దిశాహా
లసజనితాహంకృతి విడి, వనజోదరపారతంత్ర్యవశగాత్రకు లై. 119

సీ. చక్రభూధరశిలస్వాములకైవపునఁ, గనుపట్టుసాలచక్రములపాదపు
నూర్ధ్వాండఖండమునుండు స్తంభము లయి, పంజుల్లుబహుగోపురములయు నప్పు

న్నకటికంబున మహేంద్రలోకములోని, రమ్యహర్మ్యపరంపరల బెడంగు
నింగి యుంతయు తెల్పి నిజకింకిణీధ్వని, జాలెడు కేతనచ్ఛటలసొబగు
గీ. బురరమాధృతిఘనసారభూష లనంగ, నమరునుపకంఠమణితోరణములచెలువుఁ
జూడ్కి కగిమి నల్లములతో న చుట్టి తివియ, నాననము లెత్తి కనుఁగొంచు నరిగి మఱియు.

సీ. ప్రసవరసంబాని పద్మినీస్థలములఁ, బ్రణవ మావర్తించుబంభరముల
నాగురోపవనముల మంత్రరాజము గోల్పు, శారికాశుకపికశాబకములఁ
దాపత్రయంబు డిందఁగఁ జిదానందసై,త్యము వెదచల్లుమందానిలముల
సాలోక్యసామీప్యసారూప్యసాయుజ్య,భంగుల విలసించుభాగవతుల
గీ. సంస్తుతించుచు మెచ్చుచు సంతసిలుచుఁ, గాంచి మ్రొక్కుచు రాజమార్గమున నేగి
ఖచరకులముఖ్యు లల్లంత గాంచి యెదుట, మధుమహాసురవిధ్వంసిమందిరంబు. 121

వ. కాంచి కదియ నేతెంచి భయాద్భుతానహామస్తకవక్షస్థలబాహుచరణాభిరామమూర్తులుం గరాళదంష్ట్రాకరాళాస్యులు వివిధాయుధహస్తులు విచిత్రభూషణాంబర గంధమాల్యాభిశోభితులు ననుపమానజ్ఞానశక్త్యాదిగుణసంపన్నులు నప్రతిమాష్టవిధైశ్వర్యధుర్యులు నయుతలక్షకోటిశతకోట్యాదివర్గంబులు నసంఖ్యేయులు నగు విష్వక్సేనకింకరులును, పూర్వద్వారంబునఁ జండప్రచండాదులును, దక్షిణద్వారంబున సుప్రసుభద్రాఖ్యులుం గుముదకుముదాక్షముఖ్యులును, పశ్చిమద్వారంబున జయవిజయప్రముఖులును, ఉత్తరద్వారంబున ధాతృవిధాతృప్రభృతులును రక్షింప, మఱియుం జతుర్భుజులును శంఖచక్రధరులునుఁ బీతాంబరపరికల్పితులునుం గాలమేఘసంకాశమనోజ్ఞశరీరులును గణసహస్రపరివృతులు నగు వైకుంఠవైమానికు లనేకులు పరితఃపరిరక్షకులునుం గా, హరహిరణ్యగర్భసనకాదివందనీయంబును తదీయవాఙ్మానసాగోచరామేయప్రభావైశ్వర్యస్వాభావికంబును సేవాగతపాలితానేకసురాసురసిద్ధయోగిపరంపరాసంకులప్రాంగణంబును నగునమ్మహామందిరంబునం బ్రాంజలు లగుచు నిలిచి, అవసరం బెఱింగి లోపలికి విజ్ఞాపనంబు చేసి పనిచినపిదప నాహూతులై పురుహూతముఖ్యులు హర్షోత్కర్షంబునం బ్రవేశించి, అంత రాంతరదివ్యావరణశతసహస్రంబులు దివ్యోద్యానశతసహస్రంబులుం గడచి నడచి, అనంతరం బాయనంతవిశాలరమణీయంబైన యంతర్దివ్యాయతనాంతరంబు దఱిసి చని, అందుఁ గ్రీడాశైలశతసహస్రోపశోభితంబులుం గోకిలశారికామయూరకీరాది శకుంతకులకోలాహలకలకూజితసమాకులంబులుం బరితఃపరిలసితపవమానపాదపస్థనానాగంధ సర్వదివ్యప్రసవసమగ్రంబులుం గ్వచిత్క్వచిదంతిష్ఠపుష్పరత్నాదినిర్మిత దివ్యలీలా మంటపశతసహస్రాలంకృతంబు నగు పారిజాతాదిదివ్యకల్పకారామశతసహస్రంబుల నేత్రను, నానాముక్తాప్రవాళకృతసోపానపరంపరావిరాజితంబులు దివ్యామలామృత

రసోదకపూరపూరితంబులు నతిరమణీయదర్శనరాజహంసాదిదివ్యాండజకులాతిమనోహరమధురస్వరవాచాలంబులు నంతస్స్థముక్తామయదివ్యక్రీడాస్థానోపశోభితంబులు నగు దివ్యసౌగంధికదీర్ఘికాశతసహస్రంబులచేతను, మఱియునుం బ్రవిష్టజనంబులకు నిరస్తాతిశయానందైకరసానంత్యంబున సకలకరణసమున్మాదంబులు ననవరతానుభూయమానంబు లయ్యు నభూతపూర్వంబులచందంబున నవనవాశ్చర్యావహంబులు నై నారాయణదివ్యలీలాసాధారణంబులుం బద్మవనాలయాదివ్యలీలాసాధారణంబులును నగు వివిధమధురక్రీడాదేశశతసహస్రంబులచేతను పరివృతంబై, దివ్యరత్నమయంబును దివ్యరత్నస్తంభశతసహస్రశోభితంబును దివ్యనానారత్నకృతస్థలీవిచిత్రంబును దివ్యాలంకారాలంకృతంబును బ్రతిప్రదేశకృతదివ్యపుష్పపర్యంకవిలసితంబును నిత్యవికచనానాప్రసవాసవవాసనాస్వాదమత్తభృంగావళీసముద్గీయమాన దివ్యగాంధర్వపూరితంబును జందనాగరుకర్పూరదివ్యపుష్పావగాహితమందానిలాసేవ్యమానంబు నగుదివ్యాస్థానమంటపంబునందు మధ్యప్రదేశంబున, విశ్వప్రపంచసామ్రాజ్యభారవహుఁ డగువిష్వక్సేనుండును, వెండియు స్వభావనిరస్తసమస్తసాంసారికస్వభావులును భగవత్పరిచర్యైకభోగపరాయణులు నసంఖ్యేయులు నగువైనతేయాదినిత్యసిద్ధపరిజనంబులును, యథాయోగ్యంబుగం బరివేష్టించి సేవింప, గుణశీలరూపవిలాససామ్యానురూపలక్ష్మీసమేతంబుగాఁ బుష్పసంచయవిచిత్రితమహాదివ్యభోగపర్యంకంబుపై ననంతభోగిభోగాసనంబున. 122

## శ్రీమన్నారాయణదివ్యమంగళవిగ్రహవర్ణనము.

సీ. ఆత్మప్రదానాహమహమికావయనంబు, సౌందర్యపర్వనకోపనంబు
నశదిశాముఖగంధితారుణ్యకౌమార, మఖిలలోకైకస్వయంసుఖంబు
పశ్యజ్జనేక్షణప్రవణామృతౌఘంబు, నైజవోరంతరాంతరపుంజంబు
సిద్ధయోగివ్రాతచేతఃప్రపళ్యంబు, వందారుదోషసర్వంకషంబు

తే. కరతలోచ్చయఫలసక్రకల్పకంబు, సర్వతోముఖసౌహార్ద్రసంప్లవంబు
నగువిచిత్రమహామహం బౌపనిషద, మమరలోచనగోచరం బయ్యె నపుడు. 123

తే. ఆదిపూరుషప్రత్యవయవములందు, వితతలావణ్యమగ్నమై వెడలలేని
ఖచరతతిచూడ్కి నితరాంగకములు దార, ప్రవణగుణములచేఁ జుట్టి తగిలికొనియె.

మ. సరసాంభోదము గాఁ దలంతురు రమాసౌదామినీసఖ్యచే
పరనీలాగము గాఁ దలంతురు మహావక్షస్తటీశోభచేఁ
బరమాంభోనిధి గాఁ దలంతురు దళచ్ఛాయోర్మిసంపూర్ణతచేఁ
మరుహాలప్రముఖామరాధిపతు లంభోజాక్షు వీక్షించు నాఁ డా. 125

చ. హరుఁడు శిరంబుపై నిడి సమాదరణంబు నటింపనప్పుడుం
బొరసినకందు కార్శ్యమును బోదా కో చంద్రుఁడ! కీమురారిప
చ్చరణము లాశ్రయించు నఖచంద్రులు పూర్ణులు నిష్కళంకులుం
హరిసరియాశ్రయంబు గలదా యని దివ్యులు మెచ్చి రాత్మలన్. 160

వ. ఇవ్విధంబున నఖిలచేతనచేతోవలోకనలోభనీయసర్వాంగసుందరుండును, నిత్యనిరవద్యనిసర్గదివ్యాద్భుతాచింత్యశౌర్యసౌశీల్యలావణ్యమాధుర్యగాంభీర్యస్థైర్యధైర్యాద్యనంతకల్యాణగుణరత్నరత్నాకరుండును, ఆత్మానురూపసుకుమారసుస్పర్శసుగంధబంధురదివ్యభూషణభూషితుండును, దివ్యమూర్తినటపాంచజన్యసుదర్శనకౌమోదకీనందకశార్ఙ్గాదిదివ్యాయుధసేవ్యమానుండును నై, నిజోత్సంగసంగతరమాసమాహితాత్మపరస్పరనిరీక్షణమధురసార్ద్రప్రణయసవ్యేతరదివ్యహస్తానుభవంబునం గాలంబు నతిన్న వింపం జేయుచు, మధురగంభీరభావసద్భుతమందహాసవిలాసవికాసితవదనారవిందశోభానుభావభావితం బగుచు నిగుడు నిజదివ్యామలకోమలావలోకనలీలాలసదాగమృతస్యందంబున నఖిలజనహృదయాంతరంబులు నాపూరితంబులు గావింప, సకలకార్యకారణైకకారణు నశేషచిదచిదంతరాత్ము, బరమాత్ము నఖిలేశ్వరేశ్వరు ననీశ్వరు నఖిలైకసాక్షి నఖిలవాఙ్మనసాగోచరానేకప్రభావు నిఖిలహేయప్రత్యనీకసంగల్యాణగుణైకతానస్వరూపుం బురాణపురుషుం బురుషోత్తముం బుండరీకాక్షు సమస్తచేతనైకాభిగమ్యు సర్వప్రకారైకనిరతిశయభోగ్యు నాశ్రితవత్సలు నాపత్సఖు ననాథనాథుం గృపాలీలాపరాయణు శ్రీమన్నారాయణుం గాంచి, మహేంద్రాదిబృందారకు లాపాదచూడంబు నాచూడపాదంబునుం గాఁ దదఖిలావయవంబుల నెల్లి వివిధముపమందసౌందర్యసముత్తేజసద్యోలావణ్యామృతరసపూరంబు నాత్మీయనిశ్చలదృష్టినాళంబుల వెక్కసంబుగం గ్రోలుచు నిరస్తసమస్తాంతస్తాపులు నిస్సీమపరమానందజలధినిమజ్జమానాంతరంగులుం బ్రకృష్టసంతోషబాష్పధారాప్రాలంబచుంబితోరస్కులుం బ్రహృష్టరోమాంచకంచుకితసర్వాంగులు నగుచు నత్యంతసాధ్వసవినయావనతసర్వాంగంబులతోఁ దదీయదివ్యపదపీఠోపాంతప్రదేశంబుల నంతంతం బునఃపునస్సాష్టాంగదండప్రణామంబు లాచరించి లేచి ఫాలకీలితాంజలిబంధంబులతో గద్గదకంఠంబులతో నిట్లని వినుతించిరి. 161

## దేవేంద్రాదులు శ్రీమన్నారాయణుని స్తుతించుట.

భుజంగప్రయాతము.

నమస్తే సమస్తైకసంతన్యమూర్తే, నమస్తే సమస్తస్య నాద్యంతకర్త
నమస్తే ప్రశస్తోల్బణజ్ఞానమూర్తే, నమస్తే నిరస్తాంఘ్రినమ్రాఖిలార్తే: 162

వ. అని వెండియు. 163

క. నేమమున సఖిలచిదచి, త్స్వామంబున కాత్మ నగచుఁ దోఁపించుటచే
నేమై పరు లై సర్వము, వై మెరసెద వీ వొకండ వంబుజనాభా! 164

క. కారణముకంటెఁ గార్యము, వేఱై కలుగమికిఁ గాదె వేదాంతంబుల్
నారాయణ యీవిశ్వము, కారణ మగుని న్నొకండ కా వచియింపన్. 165

క. దిక్కుగఁ బుట్టెద ననునీ, యొక్కమనోరథము మొదల నొగిఁ దెలిపి కదా!
యొక్కటి దెలిసినఁ దెలియుం, దక్కటిపర్వంబునను బ్రధానపుఁబలుకుల్. 166

క. దేవతల వీని మూఁటిని, జీవుఁడ నగు నేన చొచ్చి చేసెద రూపా
ఖ్యావివరణ మనునీతోలు, భావము గనఁబడిన నిపుఁ బ్రపంచము దెలియున్. 167

క. ఆగూఢవేదశిఖలం, దా రై బ్రహ్మాత్మసత్పద ప్రముఖంబుల్
కారణము దెలుపఁ జాలక, నారాయణ! నీవిశేషనామము గోరున్. 168

తే. ఈశభవదాత్మకతచేత నెల్లజగము, నొకఁడ యని కాదె భవదాత్మకముగఁ గంట
కించనుల 'నేహ నానాస్తి కించ' నాది, వాక్యములు విశ్వవై విధ్యవారకములు. 169

క. పరమును నపరంబును మఱి, పర మై యపరంబు దెలుపఁ బడుననుశంకన్
బరమేశ! నీవు నధికము, సరియును లే దని విశేషశాస్త్రము దెలుపున్. 170

చ. తివుటఁ బయోధు లేడు గణుతించినచోటఁ దదూర్మి ఫేనబిం
దువులు సమంబు గానిగతి తోయరుహేక్షణ విశ్వ మింతయున్
భవదయుతాంశశతభాగకళాస్థిత మెట్లు నీసమం
బవు నని కాదె నీవ నిగమాగ్రము లెన్నెడు నద్వితీయతన్.

క. నేసి మఱి తాన క్రమ్మఱ, గ్రాసము గొను నేతపురువుగతి నీకలుగం
జేసినయీవిశ్వమును ర, మాసఖ! మ్రింగుదువు నీవ మరలన్ లీలన్. 172

ఆ. హార్దపద్మవీథి నాహంతవాస్మదా, దృష్టగుణవిధానజుష్ట మైన
యాపనిషద మైనయలనహ రాకాశ, మీవ యగుటఁ గాంతు రీశ! బుధులు. 173

సీ. బోధాశ్రయత్వంబు బోధమాత్రత్వంబు, రూపించుశ్రుతులవిరోధ ముడిపి
యద్వితీయత్వంబు నంతరాత్మత్వంబుఁ, జాటుప్రాబలుకులజగడ ముడిపి
గుణనిధానత్వంబు గుణవిహీనత్వంబుఁ, గలిగించుచదువులకలహ ముడిపి
దేహసాహిత్యంబు దేహరాహిత్యంబు, వచియించునొడువులవైర మణఁచి

గీ. సాత్త్వికస్మృతితత్త్వంబు సంవదింప, నైకమత్యంబు గాంచుయథార్థవిదులు
తత్త్వమున నిన్నుఁ గనుఁగొని తావకాంఘ్రి, పద్మముల నేల విడుతురు పద్మనయన!

క. పరతత్త్వసుశ్వేషణ, పరు లై వెదవు గలవారు పదిలంబుగనీ
చరణములచొప్పు వదలక, తిరిగి తిరోహితుని నిన్ను దెలియుదు రీశా! 175

క. ఊహింప సకలచిదచి, ద్దేహివి నీ వగుట లెస్స దెలిసినమీఁదన్
సోఽహ మనరాదొ ! మరి దా, సోహ మనఁగరాదొ ! బుధునకంబుజనాభా!. 176

సీ. రూపింపఁబడునీస్వరూప మిట్టిది గదా, జ్ఞానంబు నీకుఁ బ్రధానగుణము
పరమేశ ! నీజగత్ప్రకృతిభావం బెద్ది, యది శక్తి నీకు రెండవగుణంబు
పేర్మితో స్వాతంత్ర్యబృంహితకర్తృత్వ, మైశ్వర్య మనఁగ మూఁడవగుణంబు
సకలప్రపంచంబు సతతంబుఁ జేయుచో, నలయమి బలము నాలవగుణంబు
గీ. జగదుపాదాన మయ్యు నిశ్చలత వికృతి, నందమియు వీర్య మనఁగ నేనవగుణంబు
కార్యకరణంబు నెడ సహకారి నొకటి, నఖిలషింపమి తేజ మాఱవగుణంబు. 177

చ. గుణములు నీకనంతములు లోకనదోదర! యాదిభారతీ
గణితము లందులోఁ బ్రథమగణ్యము లై చెలువారు నెవ్వి త
ద్గుణములు దార యన్యగుణకోటి సమస్తముఁ గుక్షిఁ దాల్చు దు
ర్గుణగణదూర! నీవు నిజకుక్షిఁ బ్రపంచము దాల్చుకైవడిన్. 178

తే. అల్పసంకల్పలీల నయ్యఖిలమునకు, సృష్టిరక్షాలయక్రియల్ సేయు దీవు
సహజతేజోబలైశ్వర్యశక్తివీర్య, గుణము లవి యెట్టియవియొ ముకుంద! నీకు. 179

క. నీమహిమాబ్ధికణస్థిత, మై మెఱయుఁబ్రపంచ మిది యనంతం బనినన్
నీమహిమానంతత్వము, కైముతికన్యాయ మనుట గాదె! ముకుందా!. 180

క. దనుజాంతక ! కౌతస్కుత, జన మనవరతానుభూతి శాస్త్రంబులచేఁ
గని గ్రుడ్డియు వినిచెవుడును, జనసరి నీమాయ కిఁక నసాధ్యము గలదే?. 181

ఉ. ఎవ్వరు మాట మ మ్మెఱుఁగనీదు యథాకథితస్వరూప మై
యెవ్వఁడ వౌట నిన్నెఱుఁగ నీ దనుభావ్యతఁ దోఁచి యైనఁ దా
నెవ్వరి దౌటఁ ద న్నెఱుఁగనీదు ధ్రువం బగువెల్లివొట్టు నీ
త్రైగుణిమాయలో మునిఁగి తేలెదుమీలము గామె ? యీశ్వరా!. 182

చ. తృణమునఁ జేయుచేఁత యజకల్పశతాయుతభుక్తిఁ బో దను
తృణమును బుణ్యపాపములు సంతత మై యొనరించుచొప్పు త
త్తృణ మగునిమ్మహాభయదసంసృతికిన్ భవదంఘ్రిపంకజ
ప్రణతి యొకండు దక్క మఱి పారము గల్గునె! భక్తవత్సలా!. 183

క. అని మఱియుఁ బెక్కుతెఱఁగుల, వినుతింపఁ గృపార్ద్రదృష్టి వీక్షించి ఘనా
ఘనగంభీరస్వనమున, దనుజకులధ్వంసి దేవతాతతి కనియెన్. 184

క. క్షేమంబే మీ కిందఱ?, కేమిటి కరుదేరవలసె ని? ట్లనుడు సుర
స్తోమానుమతి బృహస్పతి, కౌమరసోదరునియెదుటఁ దాఁ బ్రాంజలి యై. 185

. దేవ ! సకలైకసాక్షివి, నీ వెఱుఁగని దొకటి కలద? నిక్కం బిపు డే

మై విన్నవింప విను టిది, మావలనం గలుగునట్టిమన్ననఁ గాదే? 186

క. మాంధాతృమహీపతి దృఢ, సంధామతి నుగ్రతపము సలుపఁగఁ దత్తే
జోంధీభూతం బై ని, ర్బంధంబునఁ బొందినది ప్రపంచం బెల్లన్. 187

ఆ. ఇంద్రపదము నొండె నితరపదం బొండె, నతని కెద్ది యిష్ట మది యొసంగి
భువన ముద్ధరింప నవధరింపుము దేవ!, యిదియె మనవి మాకు నిప్పు డనిన. 188

వ. సరసహాసితలసితవదనారవిందుం డగుచు మత్పదభక్తుం డైనయతనివలన నొరుల కెవ్వరికిం గీడు పొంద దట్లగుట నిశ్శంక మరలి చనుం డిదె యతనితపంబు నివారింపుదు నని కృపావలోకనంబునం బరితృప్తులం జేసి యనిపినం గృతార్థు లై మహేంద్రాదిబృందారకముఖ్యు లానందంబున నానందకపాణి కంతంతం బునఃపునఃప్రణామంబు లాచరించి వెడలి నిజనివాసంబులకుం జని యనంతరంబ. 189

సీ. దివ్యవిగ్రహకాంతిదిగ్వధూవితతికి, హరినీలవల్లరు లభినయింపఁ
బెరురంబునయందు బెడఁ గైనకౌస్తుభం, బెల్లచోఁ గలయ నీరెండగాయఁ
బింబించి కట్టినబిగువుపచ్చనిపట్టు, తోలుకారుమెఱుఁగులఁ దుఱఁగలింప
నిడువహస్తములఁ బూనినశంఖచక్రంబు, లినచంద్రదీప్తుల నీనికొనఁగ
గీ. శిరసుమకుటంబు నింగిఁ జిత్తరువు గొలుప, గల్లములఁ గుండలద్యుతి వెల్లి గొనఁగఁ
గలికితెలిసోగకన్నులఁ గరుణ చిలుక, జనవరునిమొఱ్ఱిల శౌరి సాక్షాత్కరించె. 190

వ. ఇట్లు గరుడవాహనారూఢుం డై యనఘదివ్యమునిసేవ్యమానుం డై యఖిలభువనాధిపత్యుం డై పుండరీకాక్షుండు ప్రత్యక్షం బగుటయు. 191

శా. హర్షాశ్చర్యభయంబు లుప్పతిల సాష్టాంగంబు గా మ్రొక్కి యు
త్కర్షింపంగఁ బరంబు గానియొకయంతస్సౌఖ్యముం బొంది పై
వర్షింపం బ్రమదాశ్రుపూరము కరద్వంద్వంబు నొక్కొంత గా
శీర్షంబుం గదియించి సాంద్రపులకశ్రేణీపరీతాంగుఁ డై. 192

## మాంధాత శ్రీమన్నారాయణుని స్తుతించుట.

దండకము. శ్రీవల్లభా! గల్లభాగద్వయీదర్పణాభ్యర్పణాలోక! లోకత్రయత్రాణలీలాకళాపజ్ఞ! పరాత్మ్యబాహ్యస్తృచూళీపరిష్కారమందారమాలాభవత్పాదనిర్యత్పయోధార! భారాసహస్రాంశుదీప్తప్రభాభాసమానీకృతారాతిదైతేయనాథావరోధాం జనధ్వాంతసంతాన! సంతానభూజప్రభావాదపార్థప్రజాభీష్టవస్తుప్రదానప్రశస్తా! సమస్తాత్మభావానుభావంబు నీరంబుజాతాక్ష! కొన్ని పైకొన్న నీమాయ నేమా యథామానముం గానఁగా లేక నానానుసంధానసంధానుబంధానుబంధాంధకారంబుచే నిన్నెఱుంగం గాలుంగం దరంబా? భువిం జిత్తగర్తంబునం గర్తృభోక్తృహంకృతిన్ జీవబీజంబు సంకల్పతోయాంకురం బై చు నుద్దామకామాదికాండప్రకాండంబు లడ్డంబుగాఁ బుత్రమి

త్రాదిపత్త్రంబులం జొంపమై సంపదల్ మన్వపుం గ్రొవ్విరుల్ గాఁ బునర్జన్మకృద్బీజ
సంయోజనామాత్రపాత్త్రంబు గాఁ గర్మమర్మంబునం బండ నొండొంటి కంటైనయీ
మేను లన్నానులం దట్ట మైనట్టినిస్సారసంసారఘోరాటవీవాటిక న్నిర్గమింపంగ మార్గం
బు లే కెమ్మెయిం ద్రిమ్మరం గండ్లు ముండ్లుం గొనన్ గా నొప్పిచే నెవ్వగం గూలుచుం
దూలుచుం దద్వ్యపాయం బుపాయంబునం జెందు టానందమై తోఁచు సంపంద మై
నింద్రియద్వంద్వసంప్రాప్తిచేఁ దప్తుల మైనమా నేరముల్ దూరముల్ చేసియాశీవిషాఘోర
శయ్యా! మదీయాపదల్ పాపవే! పాపవేగోదయం బింక మమ్మింక నాలింపఁ బాలింపఁ
గా దిక్కుదక్కెవ్వరే! నవ్వరే చీఁకునుం జీఁకుఁ జేయూఁత గాఁ జేఁత! నీదృశ్యవిశ్వం
బునందత్ప్రభావంబు భావంబునం దాన కానంగ లేఁ డొక్కరుం డొక్కరు న్మస్తునిం
జేయఁగా శక్తుఁ డే? యుక్తిసంధిత్స మాత్సర్యబద్ధైకబుద్ధి న్వికల్పించి కించిత్పరిజ్ఞానముం
గానఁగా లేనిదుర్వారదుర్వాదులం గాదనం జాలి లీలాకలోత్సేకత న్నైకతాపాద్యమా
నుండవై యెన్న నుద్యోగివై నీతవిద్యాగతిన్ లోకమున్ దూరితాలోకముం జేసి
చీకాకుగాఁ గాకు సేయంగ నేపోకలం బోక యేకాకులై యాను లైశ్వర్యకార్యంబు
వర్జించి పంచేంద్రియాదిప్రపంచంబు నిర్జించి మోహంబులం గోసి దేహంబులన్ బూర్ణ
గేహంబులన్ రోసి శీతాతపాభీరులై జీర్ణపర్ణానిలాహారులై ఘోరతీవ్రప్రభాచార
చాతుర్యధుర్యు ల్మహాయోగిచర్యు ల్సదాగాధసంబోధసంబాధనిర్బాధహృద్వీథులన్
నిన్ను శోధించియున్ గట్టిగాఁ బట్ట లే రన్న నమ్మెన్నఁ గా నేల? యేలా వృథా గాధ
లింకన్? భవాంధాంధుమూలంబులం గూలియుం కెక్కుడి దిక్కెదియున్ లేనిమాపాలిసాం
ద్రానుకంపాగుణావిద్ధులం జేసి నీ వుద్ధరింపంగఁ దా రెంతయున్ నీపదారాధనాసాధనా
సక్తులై భక్తిసంయుక్తులై ముక్తులై శుద్ధ మిద్ధంబు వేదప్రసిద్ధం బనూయం బమానం
బమేయం బజేయం బవాచ్యం బమోచ్యం బనాశం బనీకాశ మేసౌఖ్య మాసౌఖ్యముం
గాంతు రబ్జాలయాకాంత! యేక్రంతలన్ వ్రంతలన్ రంతలం జెందలే న్నుంపకే నింక
నేఁ గింకరత్వంబు తత్త్వంబు గాఁ జూచెదన్ దాస్య మాహాస్యముం గా నపేక్షించెదన్
భృత్యకృత్యంబు నిత్యంబు గాఁ గోరదన్ సేవకత్వంబు సత్త్వంబు గా నెంచెదన్ దాస
కీయార్హ నిర్హేతుకారుణ్యగణ్యైకవీక్షం గటాక్షింపవే! శిష్టరక్షాపరా! దుష్టశిక్షాకరా!
ధర్మసంస్థాపకా! శర్మసందీపకా! భక్తకర్మచ్ఛిదా! ముక్తిమర్మప్రదా!. 193

సీ. తృష్ణాపరుం డైన తెరువరి తియ్యని, మున్నీటిసలిలంబు లెన్ని గ్రోలు
నిఱుపేద యగువాఁడు నిర్జరగిరిఁ జేరి, జాతరూపం బెంత సంగ్రహించు
గణనాపరుం డైన గణికుండు సమకొని, రిక్కల నెన్నింటి లెక్కవెట్టు
లంఘనోన్ముఖుఁ డైన జంఘాలుఁ డొక్కరుం, డిమ్మహీవలయంబు నెంత గడచు
గీ. నట్టివయ పో యనంతకల్యాణగుణస, మృద్ధుఁ డగునిన్ను ననుబోఁటి యెంత పొగడు
నెంతమాత్రముఁ బొగడుట కేది యెఱుక?, యెఱుక నేఁ డెఁకఁ గలుగు నే? యోశ్వరా!

చ. తొలుదెస వేల్పుమానికపుఁ దోరపుఁగాంతికి మేలుబంతి క్రొ
మ్ములక మొయిళ్లనన్నియల మొల్లమికిం దగుపుట్టినిల్లు గుం
పులుగొను తోరపుం బసిమిబూమియ చూపువిడంబనంబు నీ
బలితపుమేనిచాయ కనఁ బండువు నా కొనరించె నచ్యుతా!. 195

చ. అసుజలవర్గముం జలరుహంబులు నీశ్వర! తారు శారదో
ల్లసనముఁ బూని యొప్పు నవిలంఘ్యతమగ్రకృతమీలనంబు రా
జసన్నృతికల్మి యంపలిప్రసాదము నొందక యుండునట్టి నీ
యసమపదాబ్జయుగ్మ మలరారెడు మామకమానసంబునన్. 196

చ. సురపదికంబెఁ దార తొలుచాలుసుమీ యని యెల్లవారికిం
జిరతరధాళధళ్యమునఁ జెప్పక చెప్పెడుభంగిఁ బొల్చునీ
చరణవిసప్రసూననఖచంద్రమరీచులు పర్వ నామదిం
బొలుతనంబు వో నడిచెఁ దోయరుహోత్పలబంధులోచనా!. 197

చ. సిరియును ధాత్రియున్ శయనశేశయ యుగ్మముఁ బ్రవీణలై
సరసత నొత్తుచోఁ బొసలి సంకులముత్పలకాంకురావళుల్
దెరిసిన యుష్పు డీమెఱుఁగుఁబిక్కులు నిక్కము నిక్కము దాల్పకుండునే
యురగశయానా! పాపకపాలోచితకంటకనాశభావమున్?. 198

ఉ. అంపము తైనసితొడలయాకృతిశోభ వహింప లేనియా
నిందవిఁ జాలమిన్ నిలువునీ అగుటెంత యసంటికంబముల్!
నందితభక్తలోకయతులం బగునీభవదూరుసామ్యముం
బొందఁ దలంచుధూర్తముఁ బొందె నధోగతి హస్తిహస్తముల్. 199

ఉ. కన్నులపండువై ధగధగంజిగిరంగు దుఱంగలింపఁగాఁ
జెన్ను వహించునీపసిఁడిచేల వహించిన నీలవర్ణ! నీ
యున్నతిఁ జూడ మీఁదనగ మెల్ల ఘనాఘనపంక్తి పర్వ పై
గొన్న మెఱుంగుబంగరుపుకొండగతిం దిలకించె నెంతయున్. 200

ఉ. లోకము లన్ని యన్నియును లోఁగొనియుం దనలేమిఁ జూపునీ
యాకృశమధ్యభాగ మిపు డీక్షణలక్ష్యము గా దటంచు నే
నాకనుతేశ! లే పనుట యుక్తము గా దలఁ బ్రస్తుఁ గన్న నా
నేకముతోడి సాక్షికి లేమి ఘటిల్లెడునట్లు గావునన్. 201

చ. పాలుపుగ మధ్యదేశముఁ బూనిన కౌస్తుభ మెట్టిచాయలన్
తళతళితద్యుతుల్ గొలుప దైత్యవిమర్దన! నీయురంబు ని
ర్మలరుచి నూడఁ బొల్చు నడుమం బ్రతిబింబితబాలభానుమం
డలము చెలంగఁ బొల్చు యమునానది గన్నహ్రదంబు కైవడిన్. 202

చ. దళితమహేంద్రనీలరుచిదాయకవిగ్రహ! నీగభీరతా
జలనిధిభావముం దెలుపఁ జాలినలక్షణలక్షితంబు లై
యలవడెఁ గంకణాంకితము లై సముదంచితశంఖచక్రసం
కలితము లై యభంగపరిఘాసముతుంగభుజాతరంగముల్.

చ. తనసుషమావిశేషములఁ దప్పక శంఖములం జయించుటం
దనికినకీర్తిరేఖలవిధంబున నుజ్జ్వలకాంతిఁ బొల్చునీ
యనుపమతారహారలతికాపరికల్పితవేల్లనంబుచేఁ
గనుఁగొన నొప్పు నీ కిపుడు కంధరకంధరవర్ణబంధురా!.

చ. వెడవెడ క్రొత్తక్రొత్తమొగి విచ్చినకెందలిరాకుఁ గెంపు చూ
పెడుజిగి గల్గునీయధరబింబమరీచులు దొంగలింప నీ
బెడఁగు వహించు నెమ్మొగము పేరిటిపున్నమచందమామకున్
సడలనిదట్టపుంబొడుపుఁజాయ ఘటించెడు నంబుజోదరా!.

చ. తిలకితదంతకాంతు లనుతీవమెఱుంగులు సుస్వరాఖ్యగ
ర్జలు గలనీవచోమృతరసంబులు పైఁ గురియంగ నామదిం
గలభవతాప మెల్ల విడి గ్రమ్మెవె యంగకదంబకంబులం
బులకనవాంకురంబు లివి పొం దగురీతి గదా! గదాధరా!.

ఉ. ముద్దులు గుల్కునీభువనమోహనకుండలరత్నదీధితు
ల్గద్దతిలాగు మై ధళధళం బొలుపార శుభంగిఁ జూడఁ గాఁ
దద్దయుఁ జెన్ను మీఱెడుఁబదప్రణతానతకేళిలోల! నీ
నిద్దపుఁజెక్కుటద్దముల నిల్వక జాఱుచుఁ బ్రాఁకుకై నడిన్.

ఉ. క్రొవ్వున మచ్చరించి తుద గూడక వే శరణార్థిబుద్ధితో
నివ్వటిలంగ నీమొగము నెమ్మదిఁ జొచ్చి వెలుంగుచున్నపుం
గ్రొవ్విరితెల్లదామర లొకో! యనఁ గాఁ దగి చక్రహస్త! తే
నవ్వు గొలంకునీదునయనంబులు నామదిఁ జూఱలాడెడిన్.

ఉ. నాసిక పేరిమవ్వపుటనంటికిఁ బైబొంటు లాకు లయ్యె ను
ల్లాసము చూపులేఁతమొవులాగు నెయిం దిలకంబు గట్టెనుం
బ్రాసవగంధ మింపు సని బంభరడింభకపఙ్క్తి చేరున
ట్లై సకలేశ! నీదునిటలాలకజాలక మింపు గొల్పెడిన్.

చ. అభయవితీర్ణిధుర్య! కరుణామృతవర్షము చూపుమేఘస
న్నిభుఁడగునీకు నీవివిధనిర్మలరత్నకిరీటభూషణ
ప్రభలు ఘటించు చున్నయవి భక్తమయూరమహోత్సవంబు గా
నభినవపాకశాసనశరాసనసృష్టికళాకలాపముల్.

ఉ. ఉల్లము చల్ల నయ్యె మొద లూడె మనోరథముల్ జగంబుపై
నొల్లమి పుట్టె చేరఁగడ నొందితి నీశుభదివ్యవిగ్రహా
భ్యుల్లసనావలోకనసుఖోదధిలోపల నోలలాడుచుం
బొల్లిటివాఁడఁ గానిగతిఁ దోయరుహేక్షణ! సంతసించెదన్. 211

చ. తెలియనిధూర్తవర్తనులు తెంపరులై తమయుక్తిభంగులన్
బలుకుట గాక నిక్కముగ భక్తివశుం డగునిన్నుఁ జూడఁ గాఁ
గలుగుటకంటె నొండొకసుఖంబును గల్గునె? కల్గ నిమ్ము! నా
తలఁపున కింపు గా దిదియ తప్పక కల్గ ననుగ్రహింపవే!. 212

క. అని భక్తిపరతఁ గ్రమ్మఱ, వినతుం డగునృపునిఁ జూచి విశ్వైకగురుం
డనుకంపమై ఘనాఘన, ఘనగర్జాస్వరవిధావికస్వరఫణితిన్. 213

## శ్రీమన్నారాయణుండు మాంధాత ననుగ్రహించుట.

తే. కువలయేశ్వరచంద్ర! నీకోరినట్ల, మోక్షఘంటాపథం బైనమునివరైక
దుర్లభాస్మత్పదాంబుజోద్భూతభక్తి, గలుగు నీ కింక నాయనుగ్రహమువలన. 214

వ. అస్మదీయమాయావిమోహితం బైనజగజ్జనంబు యథార్థంబున నన్నెఱుంగను మత్పద ప్రాప్తిరూపమోక్షంబు గొనను నెఱుంగదు. నీవు మదీయమాయాజయంబును మత్పద ప్రాప్తిసాధనం బైన మదీయపదభక్తియు నొసంగితి నెప్పటిగతి రాజ్యపరిపాలనంబు సేయుచు మద్భక్తియోగనిష్ఠుండ వై యుండు మని కృపావలోకనసుధాధారల నభిషిక్తునిం జేసి భగవంతుం డంతర్ధానంబు నొందినం గృతార్థుం డై. 215

శా. చేసెం బ్రాజ్యము గాఁగ రాజ్యము నృపశ్రేష్ఠుండు ధీనిష్ఠుఁ డై
త్రాసాపాదితదోషదూరఘనరత్నద్రత్నగర్భాసము
ద్భాసిస్వీయభుజాభుజంగమనిపీతక్రూరవైరారికాం
తాసోల్లాసవిలాసహాసనికరోదంచత్పయఃపూరుఁ డై. 216

క. కవితావిచక్షణత గల, కవి కంఠవిభూషణముగఁ గైకొనవలయుం
గవిసింహనృసింహవిరచిత, కవికర్ణరసాయన మనుకావ్యము దీనిన్. 217

## ఆశ్వాసాంతము.

శా. ప్రస్తుత్యప్రవిఫుల్లహల్లకరుచిస్పర్ధాళుహస్తాభయ
ప్రస్తారప్రతిభారితానతవనస్పర్యాయనాదోద్యమ
ప్రస్తావోద్ధతనాకప్రతీకవిలసత్ఫాల స్థలాద్రిస్ఫుట
త్కస్తూరీతిలకోపలక్షితదళత్కల్హారవారత్రపా. 218

క. ఆదిమశఠకోపాది, ద్వాదశనిజసూరివిరచితద్రావిళగ్రం
థాదృతసతతశ్రవణా, స్వాదకళాముక్తముక్తసామవిభేదా. 219

మాలినీ. శతశతరవితేజా సర్వరాజాధిరాజా
నతజనసురభూజా నాభిదీవ్యత్సరోజా
సతతమహితభూమా సత్యసంపూర్ణకామా
దితిసుతకులభీమా దేవతాసార్వభౌమా. 220

గద్య. ఇది శ్రీమద్భట్టపరాశరదేశికేంద్రచరణసరసీరుహసేవకోపసేనకనరసింహనామధేయ ప్రణీతం బైనకవికర్ణరసాయనం బనుకావ్యంబునందుఁ దపశ్చరణంబును, గ్రీష్మవర్షా శిశిరర్తువర్ణనంబులును, అప్సరస్సమాగమప్రకారంబును, నృత్తప్రపంచంబును, సముద్రవర్ణనంబును, వైకుంఠవర్ణనంబును, భగవద్దివ్యమంటపవిగ్రహవర్ణనంబును, స్తోత్రంబును నన్నది సర్వంబును షష్ఠాశ్వాసము.

కవికర్ణరసాయనము సంపూర్ణము.



చెన్నపురి : వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారి
ఆదిసరస్వతీనిలయముద్రాక్షరశాల యందు
ముద్రితము — 1916.